అంతకుఁడు, మృత్యువు పాతాళము, బడబాముఖము, కత్తిధార హాలహాలము, అగ్ని, సర్పము, ఏని నన్నిటిని నొకదెసఁ దాసులో నైచి రెండవ దెస స్త్రీని నెక్కించి తూచినచో వనితయే బరువుగా నుండును. గోవులు క్రొత్తక్రొత్త తృణములకై వెదకుచున్నట్లు స్త్రీలు క్రొత్తవానికై వెదకుచుందురు. ఈపంచభూతములు లోకములు స్త్రీ పురుషు లెప్పుడు సృష్టింపఁబడిరో యప్పటినుండియు స్త్రీలయందీదోష ములు నిరూఢములై యున్నవి.

శంబరుఁడు నముచి బలి కుంభీనసుఁడు మయుఁడులోనగుదానవు లెన్నిమాయ లెఱుంగుదురో యామాయలన్నియు స్త్రీలకు సహజము లై యుండును. పెక్కేల స్త్రీలు అనృతమును సత్యముగాను, సత్యము ననృతముగాను జెప్పి వాదింపఁగలరు. సమస్త శాస్త్రవేత్తలకు శుక్ర బృహస్పతులుగూడ స్త్రీబుద్ధి నతిక్రమింపఁజాలరు.

మహాత్మా! మఱియొక విశేషము జెప్పెద వినుము.

శ్లో. ఉజ్జ్వలవపుషం పురుషం కామయతే స్త్రీనరోఽపి తాం దృష్ట్వా
అనయో శేషవిశేషం స్త్రీ కాంక్షతిధమన్నిరపేక్షా
అభ్యర్థితాపి పుంసా సహసా నస్వీకరోతి సహజేన
సుకృతసమయాద్య పేక్షీ పరిచర్తతేవా నవా పురుషః

చక్కని పురుషుని చూచి స్త్రీలు చక్కని స్త్రీని జూచి పురుషుడును వరించుట సహజమనుకొనుఁడు. స్త్రీమాత్రము ధర్మాపేక్ష విడిచి వరించును. ధర్మాపేక్షచే పురుషుఁడు సందేహించును.

సురమునీంద్ర! స్త్రీలు ఏదియో హేతువునుబట్టిగాని కేవలము ధర్మాపేక్షచే వరింపకుండరు. ఇదియే స్త్రీస్వభావమని యెఱింగించెను. విని నారదుండు పంచచూడను మెచ్చుకొనుచు నందేనిం బోయెను. అని యెఱింగించి మణిసిద్ధుండిట్లు ... చెప్పందొడంగెను.

# కలియుగ ధర్మములు

శ్రీకృష్ణనిర్యాణమైన పిమ్మట కలియుగ ప్రారంభమున వ్యాస, జైమిని, గౌతమ, పరాశర, గాలవ, శాతాతప, శంఖలిఖితాది మహా మునులొక సభజేసి కలిధర్మములగురించి యిట్లు సంభాషించుకొనిరి.

గౌతముఁడు—మునీంద్రులారా! యిప్పుడు కలియుగము ప్రారంభించినది. ఇందు బ్రాహ్మణులు శ్రుతిచోదితములగు కర్మలు విడిచి శూద్ర ప్రాయులై వర్తింతురు. వర్ణాశ్రమధర్మములు నామమాత్రావశిష్టములై పరివర్తిల్లును. కావున కొన్ని నియమములు మార్పవలసి యున్నవి. ఇందులకు మీమీ యభిప్రాయముల నివేదింపవలయును. అని చెప్పుచుండగనే నారదమహర్షి యొకచేత మొగంబు నొకచేత గుహ్యాంగంబు మూసికొని యాసభకరుదెంచెను.

అమ్మునివరుంజూచి యందున్న తాపసులెల్ల విస్మయము జెందుచు నాసంకేతక మేమని యడిగిన నారదుం డిట్లనియె. కలియుగ ధర్మముల గురించి మీరు సభజేసి నన్ను రమ్మని వార్త నంపితిరిగదా తత్సంబంధంబులగు క్రియలసూచించుచు నిట్లు వచ్చితినని చెప్పుచు మఱియు నిట్లనియె.

కలియుగంబునఁ బ్రజలకు నీ యింద్రియనియమము లేమియు నుండవు. నోరు సత్యమునువిడిచి ధర్మము నతిక్రమించి యిష్టము వచ్చినట్లుగా మాట్లాడుచుండును. స్త్రీపురుషులు విధినిషేధముల విమర్శింపక పశువులవలె స్వేచ్ఛాసంయోగములు గావింపుచుందురు. కలియుగంబున నీయింద్రియద్వయమే కడుంగడు దుష్టమై చెడిపోవును అని సూచింపుచు నిట్లు కప్పికొనివచ్చితినని మెఱింగించి యామునిపుంగవుఁడు

సమాజమునెల్ల వినోదముగా నవ్వఁజేసెను.

పిమ్మట గౌతముఁ డిట్లుపన్యసించెను. ఇదివఱకు మనము వర్ణాశ్రమాచారముల శ్రుతిచోదితముగా విధించియుంటిమి. వానిలోఁ గొన్నిటిఁ దత్తత్క్రియలయందు మాత్రమే చేయఁదగునని తెలిసియుంటిమి. శ్రాద్ధ మాంసభోజనము విధవాప్రజోత్పత్తి అసవర్ణవివాహము లోనగు విధుల నంగీకరించి ధర్మశాస్త్రములలో వ్రాసి యుంటిమి కలియుగంబునఁ బ్రజలు నియమ బలవిహీనులగుట నట్టి విధులఁ గొన్ని నవరింపవలసియున్నది. యిందులకు మీయభిప్రాయము తెలుపవలయు నని యుపన్యసించిన విని నారదమహర్షి తొలుతనిట్లనియె.

నారదుఁడు—శ్లో. సముద్రయాతు స్స్వీకారః కమండులు విధారణం
ద్విజానామసవర్ణాసు కన్యాసూపయమ స్తథా
దత్తాక్షతాయాః కన్యాయాః పునర్దానంపరస్యచ
ఇమాన్ ధర్మాన్ కలియుగె వర్జ్యానాహుర్మనీషిణః

సముద్రాయనము, సన్యాసము, బ్రాహ్మణులు ఇతరజాతి స్త్రీల వివాహమాడుట, అక్షతయోనులగు స్త్రీలకుఁ దిరుగా వివాహము జేయుట, వీని నిషేధింపవలయునని నాయభిప్రాయము

శాతాతపుఁడు—

శ్లో. యావద్వర్ణవిభాగో స్తియావద్వేదః ప్రవర్తతే
సన్యాసం చాగ్నిహోత్రంచ తావత్కుర్యాత్కలౌయుగే.

ఎంతవరకు వర్ణాశ్రమధర్మవివక్ష వేదప్రచారము ప్రవర్తించునో యంతకాలము సన్యాసము యజ్ఞకర్మలు చేయవచ్చునని నేనభిప్రాయ మిచ్చుచున్నాను.

పరాశరుఁడు—

శ్లో. ఊఢాయాః పునరుద్వాహం జేష్ఠాంశంగోవధం తథా
కలౌపంచ నకుర్వీత భ్రాతృజాయాం కమండులుం.

గౌతముఁడు—ఊహ యన నేమి?

పరాశర—ఒకనిం బెండ్లియాడినది. "పరపురుషసంయోగాదుర్ని తేఊహాపదేయం" అని కొందఱభిప్రాయ మిచ్చుచున్నారు. ఊఢయైనను అక్షతయోనియైనచోఁ దిరుగా వివాహము చేయవచ్చును.

శ్లో. నష్టేమృతే ప్రవ్రజితేక్లీబేచ పతితే పతౌ
పంచత్స్వాపత్సునారీణాం పతిరన్యోవిధీయతే.

ఈయైదువిపత్తులయందు స్త్రీకి బునర్వివాహము చేయనచ్చునని నేనభిప్రాయ మిచ్చితిని.

గౌత...మీరు రజస్వలానంతరము స్త్రీవివాహము చేయుట కంగీకరింతురా?

పరాశ—అంగీకరింపను.

శ్లో. అష్టవర్షాభవేద్గౌరీ నవవర్షాతురోహిణీ
దశవర్షాభవేత్కన్యాతత ఊర్ధ్వంరజస్వలా.

కన్యకు సిగ్గు తెలియకపూర్వమే వివాహము చేయవలయును.

శాతాతపుఁడు—అట్టైన నక్షతయోనియగు స్త్రీకిం బునర్వివాహము మీ రెట్లంగీకరించితిరి?

పరాశరుఁడు—పదియేండ్లు దాటకుండ కన్యక భర్తృవియోగము బొందెనేని యట్టి కన్యకకుఁ బునర్వివాహము చేయవచ్చు నని నేనభిప్రాయమిచ్చెదను.

శాతాతపుఁడు

శ్లో. వరశ్చేత్కులశీలాభ్యాం నయుజ్యేతకదాచన
బలా దాహృత్యతాం కన్యాం పునర్గుణవతే నయేత్.

ప్రమాదవశంబున వరుని కులశీలాదులం దెలియక కన్యకనిచ్చిన పిమ్మట నతండు దుష్టుండయ్యెనేని యాకన్యకను బలాత్కారముగా దీసికొనివచ్చి మఱియొక వరునకీయవచ్చునని నేనభిప్రాయమిచ్చితిని.

నారదుఁడు—శాతాతపా! స్త్రీస్వభావము నీ వెఱుంగ కిట్లనుచు న్నావు. పరాశరమహర్షియుఁ గొంత ప్రమాదమును బొందుచున్నాఁడు. స్త్రీలకుఁ బునర్వివాహావకాశ మేమాత్ర మిచ్చినను ద్రోహకృత్యములు చేయకమానరు. కావునఁ బూర్తిగనే నిషేధింప వలయునని నామతము దూరముగా నాలోచించినం గాని యందలి యుపకారము దెలియదు.

శంఖలిఖితుఁడు—పతివ్రతయగు స్త్రీ సహగమనము చేయవల యును. అందుల కొడంబడదేని బ్రహ్మచర్యవ్రతము చేయఁదగును అదియు చేయలేని యువతి పెండ్లియాడవలయునని నాయభిప్రాయము. వయోవ్యవస్థ దెచ్చిపెట్టిన పరాశరమహాముని యభిప్రాయము కఠిన ముగా నున్నది. నారదుని మతము లోకసమ్మతముగా లేదు.

నారదుఁడు—మునీంద్రా! నీమతము లోకసమ్మతమే కాని యిప్పు డాచరింపఁదగినది కాదు. వర్ణాశ్రమ వివక్షత యున్నంతపర్యం తము నిషేధింపవలయును. బ్రిజలు వర్ణసంకరులై స్వేచ్ఛావిహార ముల సంచరింపుచు ధర్మశాస్త్రముల గణింపనేరరు. అప్పుడు విధి నిషేధములు లేకయే ప్రవర్తింతురు.

అని యీరీతి మునులందరు పెద్దతడవు వివాదముగావించిరి. అందు గొన్నినిబంధనములు మార్చిరి. పెక్కండ్రు నారదుని మతములో జేరిరి.

శ్లో. కన్యానామసవర్ణానాం వివాహశ్చద్విజన్మభిః
విధవాయాం ప్రజోత్పత్తి ర్దేవరస్యనియోజనం
బాలాయాక్షతయోన్యాస్తువరేణాన్యేన సంస్కృతిః
యతేశ్చ సర్వవర్ణేషు భిక్షాచర్యా విధానతః
పితాపుత్ర వివాదేషు సాక్షిణాం దండకల్పనం
ఏతానిలోక గుప్త్యర్థం కలేరాదౌ మహాత్మభిః
నివర్తితాని విద్వద్భిర్వ్యవస్థా పూర్వకం బుధైః

అని మహాత్ములందరు కలియుగ ప్రారంభమున నొకసభ జేసి కొన్నియాచారముల మార్పు గావించిరి. అందుఁగూడఁ బరస్పర మతభేదములుగలుగఁగా పరాశర మహర్షి వానికన్నిటికి సామరస్యము గల్పించి యొక ధర్మశాస్త్రము రచికచెను. ఆగ్రంధస్థ విషయములు మును లందరు నొప్పుకొని తమతమ నెలవులకుఁ బోయిరి. అందులకే (కలౌపార శరీస్మృతిః) అని ప్రసిద్ధి గలిగినది.

చ. అని మణిసిద్ధుఁడెంతయు ప్రియంబున నారదమౌనిసార్వభౌ
 ముని చరితంబు దెల్పుటయు మోము వికాసమునొందవ గోపనం
 దనుఁడు బళీ! సెబాసు గురునాయక! యింతవనమున్న మీరు దె
 ల్పిన కథ లింత చిత్రముగ లేవుచుఁడీ పరికించి చూడఁగన్.

క. ఆనందంబయ్యెఁగదా
 మానసమున గురువరేణ్యా! మనకిఁక నాకా
 శీ నగరం బెన్నాళ్ళకుఁ
 గానంబడు నెపుడు మునుఁగఁగల మాగంగన్.

క. అన, లేలెమ్మిఁక నెలలో
 పునఁ బోవంగలము ము క్తిపురికిం బృథుకా
 ననమార్గమెల్ల దాటితి
 మనుపుగ సులభములు ముందునగు పయనంబుల్.

అని చెప్పినంత నప్పుడే కావిడియెత్తుకొని గోపాలుండు వెంట నడుచుచు మహాత్మా! నారదమహర్షి చరిత్రము ఇంకను జాలనున్నదని చెప్పితిరిగదా? అవ్విశేషములన్నియు మనము కాశీపురంబు జేరిన పిమ్మట సావధానముగా నెఱింగింతురుగాక. ఏమందురు? అని యడుగ నవ్వుచు నయ్యతిశేఖామణి మౌనముద్రబూనియుండుట శిరఃకంపమున నంగీకారము సూచించుచు నడిచినడిచి క్రమంబున నవ్వలి మజిలీ చేరెను.

కందగీతి గర్భచంపకమాలావృత్తము.

పురహర కామదా కనక భూధరచాపవికారదూర ధ
ర్మరతి శివా మనోహరి పురందర ముఖ్య సురార్చి తాంఘ్రియు
గ్మరుచిర పుణ్యదామదన ఘస్మర ! భక్తసమాజవంద్య శం
కరు కరుణా కరా భుజగ కంకణహారవిభూషితాంగకా.

గర్భస్థకందము.

హరకామదా కనక భూ
ధరచాపవికారదూర ధర్మరత శివా
చిరపుణ్య దామదనఘ
స్మరభక్తసమాజవంద్య శంకరకరుణా.

గర్భస్థగీతము. కనకభూధరచాపవికారదూర
హర ! పురందరముఖ్య సురార్చి తాంఘ్రి
మదనఘస్మర భక్తసమాజవంద్య
భుజగకంకణహార విభూషితాంగ.

మ. జయకృచ్చాలిశకంబి భాబ్ధి వసుభూ(౧౮౭౮)సంఖ్యాతమైయొప్పు నీ
రుయనామాబ్దమునందు నీపదనభాగం బేరుగావించి స
త్ప్రియమొప్పన్ భవదంకితంబుగ సమర్పింతుస్సదా దేవ ! య
క్షయమైయొప్పఁగ జేయుమయ్య కృప నాచంద్రార్కతారంబుగాన్

ఉ. గిరితనయా మనోరమణ ! కిన్నరసిద్ధపిశాచ సాధ్యభా
సర్వముఖదేవమౌని పరివార! కనదృజతాచలేంద్ర మం
దిర ! పురహూతముఖ్యసురదివ్యకిరీటమణీ ప్రభాలస
చ్చరణ! సురాపగాలలితచారుకపర్ద ! కృపాపయోనిధీ !

గీ. గుడమునెరజూపి బాలునకును బ్రియమున
మందుత్రాగి జడిమంబుమాన్పు కరణి
కథలనుచు జెప్పి నీతియుక్తముగ జనులఁ
గృతమతుల జేయుటయే మదీప్సితవిధంబు

గద్య. ఇది శ్రీ మద్విశ్వనాథసదనుకంపాసంపాదితకవితావిచి
త్రాత్రేయమునిసుత్రయమగోత్రపవిత్రమధిర కులకలశజల
నిధిరాకాకుముదమిత్ర లక్ష్మీనారాయణపౌత్రకొండ
యార్యపుత్రసోమిదేవీ గర్భశుక్తిముక్తాఫల
విబుధజనాభిరక్షిత సుబ్బనదీక్షితకవి
విరచితంబగు కాశీయాత్రా చరిత్ర
మను మహా ప్రబంధంబున
పదియవ భాగము
సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ విశ్వనాథార్పణమస్తు.

---

రామకృష్ణా ప్రెస్, రాజమండ్రి.



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLAI05 B138 |
| పుస్తకం పేరు | కాశీమజిలీ కథలు |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 425 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |